మును ఈచెప్పిన రసములను ఒక్కొక్కజాము నూరి గుడ్డను వడపోసిన నేడుదోషములు పోయి చల్లగానుండును. ఔషధముల పాళ్ళకు హర్ష ముగానుండును.

## 44. తాళకముశుద్ధి.

సీ. పత్రితాళకమును పరిశుద్ధివినరయ్య పచ్చనరేకులిం పలరజేసి
ఆరేకులన్నియు నటికెలోపల బెట్టి అందులోపంచిత మమరబోసి
పదమూడుజాతులు పటిమగామంటచే చక్రగాశుద్ధియా సరసముగను
శుద్ధియానొకరోజు సున్నముతోఁ బండ జంబీరరసమున జామశుద్ధి
గీ. ఔషధపుపాళ్ళకిదియును నందియుండు। శుద్ధిగలిగిన జనులకు సుఖమునిచ్చు
శుద్ధిగాకున్నరోగుల సుఖముచెడును। విష్ణుబైరాగితోఁబల్కె విశదముగను.

తా. తాళకమురేకులుగావలిచి అవికుండలోఁబెట్టి పంచితముపోసి పదమూడుజాములు పటిమగా మంటవేసి అనుకూలమయినటువంటి శుద్ధియవును. ఒకదినము సున్నపునీళ్ళతో నువండ శుద్ధియవును. నిమ్మపండ్లరసమున నొకజాముఉడికించిన శుద్ధియవును. ఔషధములలోనికి అనుకూలముగానుండును. శుద్ధియయినతర్వాత శుభమునిచ్చును. శుద్ధిగాకున్నపక్షమున సుఖముచెడిపోవును. అని విష్ణుమూర్తి బైరాగితోఁ విశదముగా చెప్పినాడు.

## 45. గంధకశుద్ధి.

సీ. ఘనులారవినరయ్య గంధకశుద్ధియు కలిసిత్పు కలబంద కలగరాకు
ఆవుపాలును ఘృతమడ్డనరమ్మును మొగిలిగజ్జెరు మునుమోదుగయును
ఇన్నిరసంబులు నివిచట్టిలోఁబోసి చట్టిమీదనుబట్ట నద్దికట్టి
గంధకముపొడిగ గట్టిగానూరియు గుడ్డపైబోసియు మూగ్గితోను
గీ. బొగ్గునిప్పులు బోరుసులోఁబోసిమఱియు। చట్టిమీఁదను బెట్టిన చక్రగాను
పచ్చజొన్నలరీతిని పారునముచు। విష్ణుబయిరాగితోఁబల్కె విశదముగను.

తా. గంధకము శుద్ధిచేయు ప్రకారము కలినీళ్ళును, కలబంద యు, గుంటకలగరాకురసమును, ఆవుపాలును, ఘృతమును, అర్ధసరము, గలిజేరు, మొగలిరేకులును, మునుమోదుగరసమును ఈరసములన్ని ఒకచట్టిలోబోసి ఆచట్టిమీదను బట్టవాసెనగట్టి బొగ్గునిప్పను బొరుసులో బోసి చట్టిమీదనుపెట్టిన పచ్చిజొన్నలవలె కుండలోనికి దిగును. అమృ తసిల గంధకమవును.

## 46 తామ్రశుద్ధి.

సీ. రాగిరేకులువేసి రెంటగాఁగాల్చియు నులవనీళ్ళనుముంచి యుంచవలయు
తరువాతదీసియు తఱచుగాఁగాల్చియు మఱి ప్రత్యక్షిరసమున మరలముంచి
తీసికాల్చియునది తింత్రిణీరసమున ముమ్మారుగాల్చియు ముంచవలయు
ఏడుమారులుగాల్చి యేడ్మారుచల్లనుముంచ శుద్ధిగలుగునిది శుభమునిచ్చు
గీ. అవియుఁదగ శుద్ధిగాకున్న హానివచ్చు। బుద్ధిమంతులు నెవ్వరైన భూమిలోన
సరసముగఁ జేయఁదీరీతి చక్కఁగాను। విష్టువయి రాగిలోఁబలెక్కు విశదముగను.

తా. రాగిరేకులు ఎఱ్ఱగాఁగాల్చి ఉలవనీళ్ళనుముంచి తరువాత దీసి తరుచుగా కాల్చి పొన్నగంటి రసములో ముంచి తిరుగ దీసి కాల్చి చింతాకు పసరులో ముమ్మారు ముంచి యేడుమారులు కాల్చి యేడు మారులు పులిచల్లలో ముంచిన శుద్ధియవును. ఈతామ్రము శుద్ధికాక పోయిన హానివచ్చునుగనుక చక్కఁగ పయిని చెప్పినప్రకారము శుద్ధిచే యవలసినది.

## 47 పంచలవణశుద్ధి.

సీ. లవణమ్ము సైంధవలవణమ్ము కలితోడ మర్దించియార్చిన మంచిశుద్ధి
సౌవర్చలవణమ్ము సరసమాగోమూత్రమున శుద్ధిపొందును ముదముమీర
లక్ష్యంబుగల బిడాలవణంబువల్లచే మర్దించియెండించ మహిమగలదు
గలిజేరురసమున పంచలవణమును గలిపియెండించిన గలుగుశుద్ధి

గీ. చింత్రిణీపత్రరసమును దీసితడపి। ముఖ్యముగ వేచశుద్ధి సముద్రలవణ
పంచలవణాలశుద్ధి యీపగిదిననుచు।విష్ణుబయిరాగితోఁజెప్పె విశదముగను.

తా. సైంధవలవణము కలిబోసినూరిన శుద్ధియవును. సౌవర్చలవణము గోమూత్రముననూరి యార్చిన శుద్ధియవును. బిడాలవణము పులిచల్లతోమర్దించి యెండించిన శుద్ధియవును చింతాకు రసమున దడిపి సముద్రలవణము వేచిన శుద్ధియవును. అయిదులవణములశుద్ధులు నీరీతిగా జేయవలెను.

## 48 గుగ్గిలము శుద్ధి.

సీ. విసరయ్యమీరలు విమలమానున్నపు నీళ్ళనుమర్దించి నేర్పుగాను
అవుపంచితమును నరటిసానయుఁగల్పి కుండలోఁబోసియుఁ గూర్మిలోడ
యంత్రానఁ దగరెండు యాములువ్వండించి చల్లార్చినప్డశుద్ధి చక్కగాను
సారిదిగుగ్గిలమును కరకతాడిరసాన నరగడెనూరియు ననువుగాను

గీ. ముద్దగాఁజేసి గుడ్డనుమూటగట్టి। నాల్గుగడియలువండిన నయముగాను
శుద్ధివచ్చును జనులకు సుఖమునసుచు। విష్ణుబయిరాగితోఁ బల్కె విశదముగను

తా. విమలము శుద్ధిచేయుప్రకారము. గుగ్గిలము సున్నపునీళ్లనునూరి అవు పంచతమును, అరటిచెట్టు రసమును, కలిపి ఈమూడురసములును కుండలోపోసి యీవిమలము మూటగట్టి పుల్లనువ్రేలాడగట్టి కుండలో మీాదనుంచి డోలాయంత్రమున రెండుజాములు వండి చల్లార్చిన శుద్ధియగును. ఈగుగ్గిలము కరకతాడికాయల రసమున అరగడియనూరి అవి ముద్దచేసి గుడ్డనుమూటగట్టి నాలుగుగడియలు వండిన శుద్ధియై మానవులకు శుద్ధినిచ్చును.

## 49 1 ఇంగువశుద్ధి, 2 యవక్షారశుద్ధి, 3 సజ్జాక్షారశుద్ధి 4 సజ్జాకారశుద్ధి. 5 గజపిప్పళ్లశుద్ధి.

సీ. కలిసజ్జక్షారము కలిపిమర్దించిన నంతలోశుద్ధియా నారెనేని
యెకడాపుకడుగుతో యవక్షారమునునూరి తడిపియార్చినశుద్ధి తప్పకుండ

సజ్జకారముశుద్ధి చనుబాలనూరియు నీడనార్చినశుద్ధినిజముగాను
గట్టియాకుటిలోన గజపిప్పలినివేసి వేచినశుద్ధియు వేగమునను

గీ. అరయనరవిందరసమును నమరఁదీసి। యింగువయు జామునూరిన నింపుశుద్ధి
శాస్త్రసమ్మత మిదియు నల్పుఁడనుచు। విష్ణుబయిరాగిలోఁబలెక్క విశదముగను

తా. కలితోను సజ్జాకారము కలియనూరి ఆర్చిన శుద్ధియాను యరడపు కడుగుతోను యవక్షారముతడిపి యార్చిన శుద్ధియాను సజ్జాకారము చనుబాల నుడికించిన శుద్ధియవును గజపిప్పళ్లు మూకుట్లో వేసి వేయించిన శుద్ధియవును తామరాకురసముదీసి యింగువ జామునూరిన శుద్ధియవును ఇదిశాస్త్రసమ్మతమయినది.

## 50 బంగారముశుద్ధి.

సీ. బంగారుశుద్ధిని బాగుగావినరయ్య వెలిగారమునుగల్పి వేగఁగరిగి
యొప్పారేకులుజేసి యొత్తుబరదనిండ నలదియు నదియునునగ్నినార్చి
యారేకుబుగడిగి యావుపాలనుజాము నుడికించఁగాఁజాలయుత్తమమవు
ఉడికించవలెవెనక్క నులవనీళ్ళనుజాము వటివుగానుడికించి వంచితమున

గీ. కలినినొకజాముడికినను గట్టిగాను। కల్మషముబాసి కనకము కాంతివచ్చు
నెవరు నీరీతి చేసిన నెన్నికనుచు। విష్ణుబయిరాగిలోఁబలెక్క విశదముగను.

## 51 సూతకభస్మము.

సీ. బడబాగ్నిమూలము పటికదుత్తూరము కలబందహేరండ కటుకత్రయము
ఆవాలునుప్పును నార్దకసౌవీర మునువీటిలో సూతమునిడకుయు
కల్వమ్మునంబెట్టి కలియఁగమదించి కుప్పియుగాఁజేసికుండలోన
సాముద్రమునుబోసి నరగునవిదిబెట్టి మీఁదసాముద్రంబు మిన్నజేసి
కుండపైనూకును కుదురుగాఁజేసియు గుడ్డమన్నునుజుట్టి గురిగజుట్టి

గీ. బాగుగాపొయిమీఁద భాండముఁబెట్టియు పదిజాములుమంట్రపలఁజేసి
శీతలంబునఁదీసి శీఘ్రముగనుచట్టి చుట్టుమూచదరగ నారిదిజేసి

గీ. బట్టదీసిన నైనకుండబట్టియుండు। తెల్లగాభస్మమైయుండు తేజమొనఁగ
సూతభస్మంబుచేసెడి సూటియిదియు। విష్ణుబయిరాగితోఁబల్కె విశదముగను.

తా. చిత్రమూలము వేరును, పటికయు, ఉమ్మెత్త వేరును, కలబందయును, ఆముదపు వేరును, శొంఠి, పిప్పలి, మిరియాలును, ఆవాలును, ఉప్పును, అల్లమును, సౌవీరమును, వీని అన్నిటిలోను, పాదరసమునూరి కల్వములో ఉంచి మర్దించి కుప్పెజేసి కుండలో ఉప్పుపోసి ఆపైని ఈకుప్పెపెట్టి ఆమీదను ఉప్పుపోసి కుండమీద మూకుడు కుదురుగాజేసి గుడ్డజుట్టి మన్ను చుట్టు మెత్తి యీకుండ పొయిమీదబెట్టి పదిజాములు మంటబెట్టి చల్లారిన తర్వాతతీసి కుండ అంచుచుట్టుమన్ను విప్పివేసి కుండమీద మూకుడు తీసిన మూకుడుకు పట్టుకొనియుండును.

## 52 రసభస్మగుణము.

సీ. పారదభస్మము పటిమజెప్పెదనయ్య శొంఠిపాత్తునుజేసి సొంపుగాను
అగ్నిరసంబున నదిగడె మర్దించి అయిదుపూటలుదినుఁడౌషధమును
సప్తదినమ్ములు చప్పిడిచేసియు నెనిమిదింట నుప్పు దినఁగవలయు
పక్షంబునీరీతిపథ్యంబుజేసిన వాతగుల్మములను వాయువులను

గీ. మూర్ఛగళరోగశూలలు మూత్రకృచ్ఛ్ర। గండమాలలుకుష్ఠువుల్ కడకుఁదొలఁగు
కడుపునొప్పులుమాన్పునుకఫమునడఁచు। విష్ణుబయిరాగితోఁబల్కె విశదముగను.

తా. పాదరసము యొక్క గుణము. శొంఠి యీ భస్మములో వేసి చిత్రమూలపురసమున ఒకగడియనూరి అయిదు రోజులు పుచ్చుకొని యేడురోజులు చప్పిడి అన్నము తినవలయును. ఎనిమిదవ రోజున ఉప్పు వేసుకొనవలెను. పదునేనురోజు లీలాగున పథ్యము జేసిన వాతగుల్మములును, వాయువులును, మూర్ఛరోగములును, గళరోగములును, శూలలును, మూత్రకృచ్ఛరోగములును, గండమాల రోగములును, కుష్ఠరోగములును, కడుపునొప్పులును మానును. కఫములణఁగును.

## 53 అభ్రకభస్మము.

సీ. వైద్యులందఱుమీరు వరుసగా వినరయ్య యభ్రకంబులు నాలుగవనిలోన
అందు నాల్గిటనొక్కఁ డమృతంబుసరివచ్చు కృష్ణాభ్రకంబును గూర్చితోను
రాతిరోటనదియురజముగదంచియు కలిబోసి కాచిన గలుగుశుద్ధి
కలువంబుననిడియు కలితోడమర్దించి మూకుడులోబెట్టిమూతగప్పి
మూఁడుపుటమ్ములుముదమొప్పఁగా వేసి యదియావుపాలలో నదురనూరి
గజపుటంబులుమూఁడు గట్టిగావేసియు నరక్షీరము చేత నారవేసి

గీ. తంజరాళనరసమునఁ గూర్చిమూఁడు। మఱియు పాలవలనీళ్ళను మరలనాఱు
నిన్నిపుటములభస్మమా నింపుగాను। ఔషధంబులనిడవచ్చు హర్షముగను

తా. వైద్యులందఱు వినవలసినది. భూమియందు నాలుగు అభ్రకములుగలవు. ఇందులో అమృతముతో సమానమయినది కృష్ణాభ్రకము. ఆయభ్రకమును రాతిరోటనువేసి చూర్ణముగాదంచి కలిపోసి ఉడికించిన శుద్ధియవును. ఇదికల్వములోపెట్టి కలితో మర్దించి మూకుడులోబెట్టి వేయినమూకుడుగప్పి కలినినూరియది మూఁడుపుటములు వేసి తరువాత జిల్లెడుపాలతోను, రావిచెక్కరసాననూరి మూఁడుపుటములువేసి మఱ్ఱియూడలరసాననూరి మూఁడుపుటములువేసి యులవనీళ్ళనూరి మూఁడుపుటములువేసి యిన్నిరసములచేతను పుటములు వేసిన యుత్తమయి భస్మమవును. ఔషధమువాడుకకు అనుకూలముగానుంచవచ్చును. ఈతీరున వేసినభస్మము బహుశ్రేష్ఠమవును.

## 54 సింధూరభస్మము.

సీ. అభ్రకసింధూర మదిచేయువిధమును వినుఁడయ్యచెప్పెద పెద్దలార
కలబంద కాకర గలిజేరునల్లాక్షి పొన్నగంటి సుగంధి పాలుపుదుం
బప్పుడుపెన్నేరు దూలగొండియునిప్ప కారుములగనల్ల కలుజుంట
భూతులసి వలాశమూందులుభృంగియు నేలగుమ్ముడియును నేలతాడి

వావిలడ్డసరంబు వాకుడుమగతంబ జెముడుజంబునునిమ్మ క్రమముగాను
ఒక్కొక్కరసములో నొక్కొక్క దినమును మర్దించిపుటముల మరఁగ వేయ
అభ్రకసింధురం బవునమృతమ్ముగ సురలకు సుధయెట్లొ నరులకును

గీ. జనులకమృతంబునిదియును జగతిలోన । నిదియు భక్షించువారికి నిహమువరము
మృత్యుభయమునుదప్పించు ముదమునిచ్చు । విష్ణుబైరాగితోఁబల్కె విశదముగను.

తా. అభ్రకసింధూరము చేయు ప్రకారము చెప్పెదను కలబంద ను, గానుగను, గలిజేరును, సర్పాక్షిని, పొన్నగంటిని, సుగంధిని,దుష్టు పురసంబును, పెన్నేరును, దురదగొండియును, నుప్పిరసమును, కాకు ములగానును, నల్లకల్వదుంపలును, భూతులసియు, మోదుగయు,గుంట కలగరయు, బోడసరమును, నేలగుమ్మడియు, నేలతాడియు, వావిలియు అడ్డసరమును, వాకుడును, కడిమి, జెముడును, నేరేడును, నిమ్మరసమును, ఒక్కొక్కరసమును ఒక్కొక్కదినము మర్దించి ఒక్కొక్క పుటము వేసిన అభ్రకసింధూరమవును. దేవతలకు అమృతము ఎటువంటిదో మానవు లకు ఈ యభ్రకసింధూరము అటువంటిది. మృత్యుభయము దప్పించి సంతోషమునిచ్చును.

౭౭. ఉక్కుభస్మము.

సీ. ఉత్తమమైనట్టి యుక్కురాపిడిజేసి వరగనూనెనుజాము వండవలయు
జలములతోఁగడ్గి జాడెండలోఁబెట్టి నల్లతుమ్మరసమ్మున నునిగిబోని
అతినాల్గుగడియలు నమరవండియునార్చి తీసివేగంబున దివ్యముగను
జంబువృక్షరసాన జామునేపుడికించి మర్దించియెండించి మరలదాని
అడులకరసాన నరజామునుడికించి యెగినూరియెండించి యున్నదాని
తింత్రిణీరసములో తిరగంగనుడికించి యెండించియుడికించి యెనఁగవేగ
ములగలోనూరియు ముదముతోనెండించి గోమూత్రమునగాచి గొప్పగాను

గీ. మూకిటను బెట్టి యామీద మూతగప్పి । గజపుటము వేసి నట్టైన గట్టిగాను
భస్మమైయుండు నిదియును భాసురముగ । విష్ణుబైరాగితోఁబల్కె విశదముగను.

తా. ఉత్తమమైన ఉక్కురావిడిగాగోసి నూనెతో నొకజాముపండించి అది నీళ్ళుపోసి కడిగి ఒకజాము ఎండించి నల్లతుమ్మరసముపోసి నాలుగుగడియలువండి ఆరించి అదితీసి నేరేడురసాన జామడికించి యెండించి మరల దానిలో నుసిరికాయరసాన నాల్గుగడియలుడికించి నూరి యెండించి చింతాకురసాన తిరుగనుడికించి యెండించి మర్దించి యిది ములగాకురసాననూరి యెండించి గోమూత్రానుడికించి యిది మూకుట్లోపెట్టి ఆపైన మూకుడుగప్పి గజపుటము వేసిన మిక్కిలి ప్రకాశమానముగా నుండును.

## 56. ఖడ్గభస్మము.

సీ. ఖడ్గభస్మంబును కల్వంబులో బెట్టి వినరానిరసమున విడియనూరి
అదబిళ్లలనుజేసి యార్చి మూకిటబెట్టి ఆరొక్కగజపుట మమరవేసి
తిప్పతీగెరసము తీసిమర్దించియు పుటము లేడిటువేయ బొల్పుగాను
ఆవుపంచతమునవరలేక తెగనూరి యెండించిపుటములు నేడువేయ
దుష్టపాకురసాన దురుసుగానూరియు నార్చిపుటము వేయ నైదురెండు
అరకక్షీరముతోడ ననువుగమర్దించి గజపుటములు నేడు గాగజేసి
యిత్తురసమ్మున నిదినూరివిడువక వడిగజపుటములు వరుసనేడు

గీ. ఇన్నిపుటములు వేయగా నినునికాంతి। అద్భుతలోహంబుమిక్కిలియందముగను
జనములీరీతిలోహంబు నలుపుడనుచు। విష్ణుబైరాగితో బల్కె విశదముగను.

తా. కటారికోసిన రావిడిభస్మము కల్వానబోసి జెముడుపాడలరసాననూరి అది బిళ్ళలుచేసి మూకుట్లోపెట్టి యేడు గజపుటములువేసి తిప్పతీగరసాన నేడుపుటములువేసి దుష్టపాకురసముననూరి ఆర్చి యేడు పుటములువేసి జిల్లేడుపాలతో నేడుపుటములువేసి చెరుకు ఆకురసాన నేడుపుటములువేసి నిమ్మపండ్లరసాన నేడుపుటములువేసి యిన్నిపుటములునునీలాగునవేసిన సూర్యకాంతి వచ్చును. ఈచందముగ లోహము అగును.

## 57. బంగారుభస్మము.

సీ. బంగారురేకులు బలుపుగా వేయించి భస్మము వేయుట బాగుగాను
మాదీఫలరసాన మరిరసభస్మము గడియమర్దించియు గట్టిగాను
బంగారురేకుల బట్టించివత్తుగా మూసలో బెట్టియు మూతగప్పి
గొప్పపిడకలతోడ గొప్పపుటము వేయ బంగారుభస్మమౌ భాసురముగ
గీ. ప్రజలునీభస్మముందిన్న బ్రబలముగను। రాజ్యమును సిరియుసంపద రాజసమును
గట్టిగానెవరుజేసిన గల్గుననుచు। విష్ణుబైరాగిలోబలెక్క విశదముగను.

తా. బంగారు పల్చని రేకులుగా వేయించి మాదీఫల రసముతో మంచిరసభస్మమునూరి యీరేకులకు వత్తుగా పట్టించి మూసలోనుంచి మీదను మూసమూసి ఆవు పేడపిడకలతోను గొప్పపుటము వేసిన బంగారము రేకులు భస్మమగును మానవులీ భస్మమును పుచ్చుకొనిన రాజ్యమును, సిరిసంపత్తును గలుగును.

## 58. కాంతభస్మయోగము.

సీ. కాంతపురాళ్లను కాల్చి పుల్లనిచల్ల ముంచినశుద్ధియౌ ముదముమీర
గంధకమరపాలు కాంతంబులో పెట్టి కొండపిండియుగొమ్ము గోరివిడాకు
ఆస్ఫోటరసమును నాకిరిశుకంబును నిమ్మపండ్లరసాన నింపుగాను
ఒక్కొక్కరసముతో నొక్కొక్కయామము నూరిమూసనుబెట్టి తోరముగను
గీ. నైదుపుటములు వేసిన మోదముగను। కాంతభస్మమునైయుండు ఘనతమిగుల
ఔషధంబులనిడుటకు నలవియగును। విష్ణుబైరాగిలోబలెక్క విశదముగను.

తా. కాంతపురాళ్ళు అనగా సూదంటురాళ్లు ఎర్రగా కాల్చి పులిచల్లలో ముంచిన శుద్ధియగును. కాంతములోన గంధకము అరపాలుపెట్టి కొండపిండియాకు రసమును, కొమ్ము గోలిమిడాకు రసమును, జిల్లెడురసమును, మోదుగ రసమును, నిమ్మపండ్ల రసమును, ఒక్కొక్క రసముతో నొక్కొక జాము మర్దించి మూసలో బెట్టి అయి

దుపుటములు వేసిన భస్మమయియుండును ఔషధములలోనికి అనుకూలమయియుండును.

### 59. కాంతసిందూరరసము.

సీ. కాంతభస్మములోనఁ గల్పి హింగుళమును సమము రెండును జేసి సరసముగను
మర్కటరసమున మర్దన జేసియు నెఱ్ఱమన్నున మూసయొండ జేసి
యామూసలోనుంచి యాపైనమూసియు యెఱ్ఱవంకము మెత్తియు నగనార్చి
గజపుటంబులు మూషఘనముగా వేసిన బాలసూర్యునిఁ బోలి భాసురముగ
గీ. కాంతసింధూరమగును ఘనులకిడియు । నేలకులవంగ దాల్చినియేకముగను
గల్పి శర్కరతోఁ దిన్న కాంతివచ్చు । విష్ణుభైరాగితోఁ బలెక్కె విశదముగను.

తా. కాంతభస్మమును ఇంగిలీకమును సమముగా జేర్చి దూలగొండరసాన మర్దించి యెఱ్ఱమన్నుమూస జేసి యొండించి ఆమూసలోని దియుంచి యాపైన మూతమూసి యెఱ్ఱబురదరాచి యార్చి మూడు గజపుటములు వేసిన పొద్దుపొడుపు బోలినటువంటి ప్రకాశమానమైన కాంతిగలిగిన సింధూరము ఘనులయినవారికి యాలకులును, లవంగములును. దాల్చినిచెక్కయు నేకముగానూరి కలిపి యీయౌషధమును పంచదారతో నిచ్చిన వారికిచాల కాంతిగలుగును.

### 60 తాళకభస్మము.

సీ. తాళకభస్మము ధవళితంబగురీతి తెలిసినయదిమీకుఁ దెల్పువాఁడ
నిమ్మపండ్లరసాన నిజతాళకమ్మును బిళకముగానూరి బిళ్ళ చేసి
అపమార్గక్షారము నశ్వత్థక్షారము కల్పికుండను బోసి గట్టిగాను
ఆక్షారములమధ్య నాబిళ్లనుంచియు దట్టునమన్నింత చూరుగట్టి
కుండను పొయిమీఁద కుదురుగానుంచియు మూఁకుడొకటిపైన మూతగప్పి
పదిజాములును మంట పటిమతో వేసిన తెటయౌభస్మమై తేజరిల్లు
తోడభస్మము వెన్నతో దిన్నయప్పుడు జ్వరములన్నియు వేగ జరుగుచుండు

గీ. రోగములుపారిపోవును రోజులందు। వాతపైత్యకుష్ఠముల్ వదలుచుండు
తాపములువాంతిజాడ్యముల్ తంద్రిగుణము విష్ణుబయిరాగితో బల్కె విశదముగను

తా. తాళకభస్మము తెల్లగానగు ప్రకారము. తాళకమునిమ్మపండ్ల రసమున నూరి బిళ్ల చేసి ఉత్తరేణిబూడిదను, రావిక ట్టెల బూడిదను రెండునుకలిపి కుండలోఁబోసి ఆబూడిదలమధ్యను ఈబిళ్లనుంచి చుట్టును చూరుగా కట్టడమును, ఆకుండ పొయిమీఁదనుంచి పయిన మూకుడు మూసి పదిజాములు గాఢాగ్నిమంటవేసిన తెల్లగా భస్మము ప్రకాశించుచుండును. ఈభస్మము వెన్నపూసనుకలిపి పుచ్చుకొనిన జ్వరము లన్నియు జడిసిపోవును. రోగములు పారిపోవును రోజుగుణములు మానును. వాతమును, పైత్యమును, కుష్ఠమును వదలిపోవును. తాపమును వాంతిజాడ్యమును, తంద్రగుణములును వదలిపోవును.

## 61 కాంస్యశుద్ధి.

సీ. కంచుశుద్ధినిమీరు గట్టిగాఁజేయ్య చింతాకుపసరున శీఘ్రముగను
పదిమార్లుగాల్చియు పసరులోముంచిన కంచుశుద్ధియగును గడియలోన
కంచుతోసమముగ గంధకమును వెట్టి యర్కక్షీరముతోడ నదియునూరి
ఆకంచురేకుల కారాఁబట్టించి వజ్రమూసనువేసి వరుసగాను
గీ. సప్తపుటములువేసిన సరసముగను। భస్మమైయుండు మూసలో భాసురముగ
ఔషధంబులపాళ్లకు నమృతమిదియు। విష్ణుబైరాగితో బల్కె విశదముగను

తా. చింతాకుపసరు బొరుసులోపోసి పదివాళ్లు ఈ కంచురేకులకాల్చి పసరులోముంచినకంచు శుద్ధియవును. గడియలో కంచురేకులకు సమముగా గంధకముపెటి జిల్లేడుపాలనునూరి యీరేకులకు ఆరారగపట్టించి యేడుపుటములు ేసి అది ప్రకాశమానమయిన భస్మమవును. ఔషధములపాళ్ళకు అమృతిస్వరూపమయి యుండును.

## 62. కంచుభస్మయోగము.

సీ. కంచుభస్మమురస గంధకదరదము లివినాల్గుసమముగ నింపుజేసి
అశ్వద్ధమోదుగ హంసపాదియుజంబు దూలతామరనల్లకుమ్మనిమ్మ

ఒక్కొక్కరసముతో నొక్కొక్కదినమును నూరిమూసనునిడి తోరముగను
ఆరునొక్కపుటమ్ము నమరంగ వేసిన బాలసూర్యునిమించు భాసురముగ

గీ. కంచుసింధూరమావునయ్య ఘనులుబాగడ। అల్లమనుపానమౌషధ మడ్డిగెత్తు
అనుదినంబునుదిన్నను నఘముబాయు। విష్ణుబైరాగితోఁబల్కె విశదముగను.

తా. కంచు భస్మమును, రసమును, గంధకమును, ఇంగిలీకమును, ఇవి నాలుగు సమముజేసి రావిచెక్క రసమును, మోదుగచెక్క రసమును, హంసపాదియాకు రసమును, నేరేడుచెక్క రసమును, దూలతామర రసమును, నల్లతుమ్మరసమును, నిమ్మపండ్ల రసమును, ఒక్కొక్క రసముతో ఒక్కొక్కదినము మర్దించి మూసలోనుంచి యేడు పుటములు వేసిన బాలసూర్యుని మించినటువంటి సింధూరమవును. కంచు సింధూరము ఇది శ్రేష్ఠమని అధికులు సంతోషింతురు. అల్లపురసాన అనుపానముజేసి అడ్డిగెత్తు ఔషధము నిత్యమున్ను ఈ భస్మము తిన్న వారికి పాపము పరిహరించిపోవును.

## 63. వంగనాగముశుద్ధి

సీ. వంగనాగముశుద్ధి వరగెడుభస్మము అజమూత్రమును చల్ల యావుపాలు
నులవనీళ్ళునునూనె యుస్త్రియాకురసాన నుడికించినను శుద్ధి యుత్తమమవు
పత్రిశాళకమును పాలాశరసమున నూరి రేకులరాచి తోరముగను
మూకుడులోఁబెట్టి మూతమూకుడుగప్పి పుట మొండు వేయుడీ పొల్పుగాను

గీ. సాంగశీతలమునదీసి చక్కగాను। పాళ్ళకును భస్మమునసంచఁ బాటియగును
అరయవింశతిమేహము లంతరించు। విష్ణుబైరాగితోఁబల్కె విశదముగను.

తా. వంగము సీసము శుద్ధిభస్మప్రకారము ఏలాగంటే మేకపంచితమును మజ్జిగయు ఆవుపాలును ఉలవనీళ్ళును నూనెయును ఉస్త్రియాకురసమును వీట్లచేతనుఉడికించిన శుద్ధియగును పత్రిశాళకమును మోదుగచెక్కరసమునునూరి తగరపురేకులకునిండ రాచి మూకుడులో పెట్టి పైన మూకుడుమూతగప్పి ఒకపుటమువేసిన భస్మమవును. చల్లారినతర్వాత తీసిన ఔషధముపాళ్లకు అనుకూలముగా నుండును. ఇరువదిమేహములకు పెట్టవచ్చును.

## 64. వంగసింధూరము.

సీ. వంగసింధూరము వరుసమీకెరిగింతు అజమోదరసమును నర్దసరము
బోడసరమ్మును బోసిమర్దించియు తమలపాకురసాన తరచినూరి
ప్రమిదలోబెట్టియు ప్రమిదమీదనుగప్పి నాలుగుపుటములు నయముతోడ
వరుసగావేసిన వంగసింధూరమా జనులెవ్వరుతిన్న జాడ్యములును
గీ. మూత్రకృఛ్రిలు మేహముల్ మూలవ్యాధి। తాపమునరక్తకాసయుతంద్రగుణము
ఇన్నిరోగంబులకునిది యీయుడంచు। విష్ణుబైరాగితోబలెక్రవిశదముగను.

తా. తగరము సింధూరముచేయు ప్రకారముచెప్పెదను వాము అర్దసరమును బోడసరమును బోసి మర్దించి తమలపాకు రసాన మర్దించి ప్రమిదలోబెట్టి పైనినూరి నాల్గు పుటములువేసిన నిది వంగ సింధూరము ఇది యెవరుపుచ్చుకొన్నను జాడ్యములు మూత్రకృఛ్రి రోగములును, మేహరోగములును, మూలవ్యాధులును, తాపములును రక్తకాసలును తంద్రగుణములును ఇన్ని రోగములకును ఇది యియ్య వచ్చును.

## 65. రజితభస్మయోగము.

సీ. వెండియురేకులు వేయించిపలుచగాం బోతుకాకరగసము దగందీసి
ఆరేకులన్నియు నారసమ్మునంగాల్చి ముంచినశుద్ధియా సంచితముగ
కాకమాక్షికమును గల్వంబులోంబెట్టి యుర్క్రక్షీరముతోడ నరయనూరి
యారేకులకునిండ నంటించియార్చియు మూకుడులోంబెట్టి మూతగప్పి
గీ. గజముపొడవునపుటమును గట్టిగాను। వేసననువెండిభస్మంబా వేగముగను
అద్దిభక్షింపుచున్నను నఘముబాయు। విష్ణుబైరాగితోజెప్పె విశదముగను.

తా. వెండిరేకులు పలుచగా వేయించి పోతుకాకరముంప రసము దీసి,ఆరేకులన్నియు ఆరసములోవుల ముంచికాల్చిన శుద్ధి యవును. కాకమాక్షికము జిల్లేడుపాలతోనూరి, ఆరేకులను పట్టించి, ఆర్చి మూ

కుడులోనుంచి మూతగప్పి గజపుటము వేసిన భస్మమవును. ఈ వెండిభస్మమును దినిన పాపములుపోవును.

### 66 శుద్ధిజేసినగంధకము పుచ్చుకొనుప్రకారము.

సీ. పార్వతీవీర్యము పరిశుద్ధిగాజేసి త్రిఫలము లేలకుల్ త్రికటుకములు
గట్టిగానూరియు గంధకమునఁగల్పి యరతులమ్ముగను గాఁగ పొద్దుజేసి
అనుదినఁబును నాజ్యమనుపానములనిది యనుభవింపఁగవలె పాషణముగను
పప్పనన్నము నేయి పాలును పెరుగును పలుచనిచారును పథ్యమిదియు
గీ. మండలము సేవజేసిన మానవులకు। కుష్ఠువ్యాధులురోగముల్ కూలిపోవు
నాయు రారోగ్యమైశ్వర్యమధికమగుచు। విష్ణుబైరాగి తాఁబల్కె విశదముగను

తా. గంధకము పరిశుద్ధిని జేసి కరకకాయలు, తాడికాయలు, ఉసిరికపప్పును, ఏలకులును, శొంఠిపిప్పలిమిరియములును ఇవి యన్నియు చూర్ణము చేసి గంధకములోగలిపి రోజునకు అరతులమువంతున రేపుమాపును నిర్ణీతముచేసి నిత్యమును నేతితో అనుపానము చేసికొని పుచ్చుకొనవలెను. పప్పు, అన్నము, నేయి, పాలు, పెరుగు, పలుచని చారునుపథ్యము. నలుబదిరోజులు ఈలాగున పుచ్చుకొనినవారికి కుష్ఠురోగములు మానును ఆయువును, ఆరోగ్యమును, ఐశ్వర్యమును అధికమవునని విష్ణువు బయిరాగితో స్పష్టముగాఁ జెప్పినాడు.

ఇది బయిరాగి చేసిన ధన్వంతరి విజయమునఁ
దృతీయాశ్వాసము. శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీ

శుభమస్తు.

# ధన్వంతరి విజయము.

## చతుర్థాశ్వాసము.

### 67 సూతికాభరణము.

సీ. తాళకమువసనాభి తామ్రము మణిశిల పార్వతీంద్రియమును పారదమును
అమృతవంగములోహ మభ్రనాగంబును హేమటంకణకాంతహింగుళములు
శొంఠిపిప్పలిమిర్య సోపునేపాళము తారభస్మము నీలి తప్పిటమును
శంఖతుత్థక్షార జాజీఫలంబులు మత్స్యకూర్మమయూర మనుజమకరి
ఛాగశార్దూలము శశవిధచేదుల సమభాగములుగూర్చి సంఖ్యలోను
కల్వంబులోనుంచి ఘనమేఘనాదము చిత్రార్ధజంబీర శ్రుతులసిని
అయిదుపూటలునూర నమృతమపునుమాష మాత్రప్రమాణము మాత్రగొనిన
గీ. శూచికావాతసర్వాంగ శుష్కవాత । పక్షవాతము తాపముల్ పారిపోవు
సూతికాభరణమ్మిది శుభముకలది । విష్ణుబయిరాగితోఁబలెక్కె విశదముగను.

తా. తాళకమును, వసనాభియు, తామ్ర భస్మమును, మణిశిల యును, గంధకమును పాదరసమును, గరళమును, తగరభస్మమును, లోహమును, అభ్రికభస్మమును, సీసభస్మమును, బంగారపు భస్మమును వెలిగారమును, కాంతభస్మమును, ఇంగిలీకమును, శొంఠిపిప్పలి మిరియ ములును, నేపాళములును, వెండిభస్మమును, నీలిమందును, సత్తుభస్మ మును, శంఖభస్మమును, మయిలుతుత్తమును, యవాక్షారమును, జాజి కాయలును, చేపచేదును, తాబేటిచేదును, నెమలిచేదును, మను ష్యులచేదును, మొసలి చేదును, మేక చేదును, పెద్దపులి చేదును, చెవులపిల్లి చేదును, దున్నపోతు చేదును, ఇవి యన్నియు సమభా

గమలుచేసి కల్వములోనుంచి నిమ్మలిచెక్క రసమునను, చిత్రమూల పురసమునను, అల్లపురసమునను, నిమ్మపండ్లరసమునను, తులసిరసమునను, ఈ అయిదురసములతో అయిదుదినములు మర్దించిన అమృతముతో సమానమగును. మినపగింజంత మాత్రపుచ్చుకొనిన సూతికావాయువులును, శుష్క వాతములును, సర్వాంగ వాయువులును, పక్షవాతములను, పారిపోవును. ఇది సూతికాభరణము.

## 68. వాతరాక్షసము.

సీ. తామ్రలోహ సుశంగ తారభస్మసువర్ణ భస్మముల్ నాల్గు నభ్రకముమతియు
కాంతగంధకములు కఫరినేపాళముల్ సమముగా గూర్చియు చక్కగాను
కల్వములోనుంచి కటుకత్రిరసముల మర్దించికుప్పె నమరగ బెట్టి
సరసంబుగా కుప్పె చట్టిలో పల బెట్టి యిసుక చుట్టును బోసి యిష్టముగను
పదునారుగడియలు పక్వంబుగా వండి దేహను పానంబు తెలిపినను ది

గీ. అద్దిగెత్తును ఫూటకు నమరసిడిన। వాయురోగంబులన్నియు వదలిపోవు
శోభలును కాసశూలలు సొంపుగుచు। వాతరాక్షసమిదియు వాడిగలది
విష్ణువైరాగితో బలెక్క వినదముగను.

తా. తామ్ర భస్మమును, తగరభస్మమును. లోహ భస్మమును. వెండిభస్మమును, బంగారుభస్మమును, పాదరసమును, కర్పూరమును, ఇంగిలీకమును, సింధూరమును, అభ్రకభస్మమును కాంతమును, గంధకమును, పాలతుత్తమును, నేపాళకొంతి, పిప్పలిమిరియాలును, రసము దీసి మర్దించి గాజుకుప్పెలోను పెట్టి కుప్పె కుండలోపెట్టి. కుప్పె చుట్టు యిసుకబోసి పదునారుగడియలువండి దేహము అనుపానము గుర్తెరిగి ఔషధము అర్ధిగెత్తు ఫూటకిచ్చిన వాయురోగములు మానును శోభలును కాసలును శూలలును మానును వాతరాక్షసము ఇది మహావాడి గలది.

## 69. ఆనందభైరవి.

సీ. చక్కనీ హింగుళ చను బాలనుడికించి పాళ్ళు రెండును బెట్టి పగిదిగాను
శుద్ధిచేసినయట్టి శూద్రినాభియు పాలు పండుటంకన మొక్క పాలు నల్ల
మిరియాలునొకపాలు మేలుగా జేరిచి జాజిఫలము పాలు చక్కగాను
నైమ్మకల్వమున నను నిమ్మపండ్లరసాన మర్దించి మాత్రలమరఁగఁజేసి
గీ. మూఁడు దినములు నిచ్చిన ముదము మీఱ। కడుపు నొప్పులు గ్రహణులు కఫములడఁగు
బలిమి గలిగించు నానందభైరవమున। విష్ణుబయి రాగితోఁ బలెక్క విశదముగను.

తా. ఇంగిలీకము చనుబాలనుడికించి అదిరెండుపాళ్లు శుద్ధిజేసిన శూద్రనాభిపాలు, శుద్ధిజేసిన వెలిగారమొకపాలు, నల్ల మిరియము లొకపాలు, జాజికాయ ఒకపాలు ఇవియన్నియు కల్వములోఁ బోసి నిమ్మపండ్లరసమున నొకదినము మర్దించి మాత్రలుచేసి దినత్రియము ఈ యౌషధము పుచ్చుకొనిన కడుపునొప్పులును, గ్రహణి రోగములును మానును.

## 70 సన్నిపాతభైరవి.

సీ. బంగారు రేకులు బరగెడు తాళక మొకపాలు బెట్టిన నొప్పగాను
పార్వతీవీర్యము పాలుతు బెట్టియు సూతంబు నొకపాలు సూటిగాను
మూఁడు పాళ్ళును నాభి ముద మొప్పఁగాఁ బెట్టి యెఱ్ఱనిమణిశిలయేకపాలు
పొంగిన టంకణంబు పొసఁగ నొకపాలు నిన్నిటికిని సమమ్ము హింగుళమును
నైమ్మ శుద్ధిని జేసి నిమ్మపండ్లరసాన రెండు రోజులు నూరి రేయుఁబవలు
ఓమంపు రసమున నొకరోజు మర్దించి యంత్రాన జాము సేవమరవండి
పూటకు చిన్నము పుచ్చుకొను చునున్న దగ్గును హిక్కయు తాపములును
గీ. కడుపు శూలలనొప్పులను మాన్పు కఫములణఁచు। విషమజ్వరములు దోషముల్విరిగిపోవు
సన్నిపాతము భైరవి సంధులణఁచు। విష్ణుబయి రాగితోఁ బలెక్క విశదముగను.

తా. బంగారుతో సమానమయినటువంటి తాళకము ఒకపాలు ఉంచి గంధకము ఒకపాలు పెట్టి పాదరసము ఒకపాలు, మూఁడుపాళ్ళు

నాభియుంచి, మణిశిల ఒకపాలు, పొంగించిన వెలిగారము ఒకపాలు వీని అన్నింటియొత్తు నింగిలీకముంచి యివియన్నియు కల్వములోనుంచి నిమ్మపండ్లరసాన రాత్రింబవళ్ళు రెండురోజులు నూరి చిత్రమూల రసాన ఒకదినముమర్దించి ఒకజాము డోలాయంత్రాన వండి పూటపూటకు చిన్నము ఔషధము పుచ్చుకొనిన దగ్గును, హిక్కయును, తలనొప్పియు, తాపమును, కడుపునొప్పులు మానును. కఫరోగములును, విషమదోషజ్వరములును మానును. ఇది సన్నిపాతభైరవి.

## 71 షడ్గుణము.

సీ. ఒకపాలుసూతము నొకపాలుసీసము నొకపాలుగంధక మొప్పగాను
మూఁడుమూఁడునుపాళ్ళు మదమొప్పఁగాఁజేసి కల్వానమర్దించిగట్టిగాను
కుప్పెలోఁబోసియు కుప్పెకుండనుబెట్టి యిసుకచక్కఁగజుట్టియెనఁగఁజేసి
కుండపాయిమీఁదను కుదురుగానిల్పియు గడియగడియమంట క్రమముగాను
వేయ షడ్గుణమది వేగసునయిఁయుండు శీతలమునఁదీయ శీఘ్రముగను
ఔషధంబునుదీసి యల్లపురసములో కుప్పెగాఁజేసియుఁ గూర్మితోడ
కన్నెకోమలిపొడి కలియంగఁబోసియు నావునేతనునది యడ్డిగెత్తు
గీ. అనుభవించిన వ్యాధులు హతములౌను। చర్దిరోగముక్షయలుశ్లేష్మములుమొదలు
ఉబ్బుపాండువులుదరము లుండవెరచు। విష్ణుభైరాగిలోబలెక్క విశదముగను.

తా. ఒకపాలు పాదరసము, ఒకపాలు సీసము, ఒకపాలు గంధకము, ఈమూడును మూడుపాళ్ళుచేసి కల్వములోనుంచి మర్దించిన చూర్ణము గాజుకుప్పెలోబోసి కుప్పెకుండలోబెట్టి యిసుక కుప్పెచుట్టుబోసి కుండపొయిమీదబెట్టి పదిగడియలు మిక్కిలిగామంటబెట్టిన షడ్గుణమైయుండును. చల్లారినతరువాత కుప్పెతీసి చిట్లగొట్టి ఔషధముతీసి అల్లపురసాననూరి కుప్పెచేసి యీఔషధములో కన్నెకోమలిచూర్ణము కలిపి ఆవునేతిని అనుపానముచేసి అడ్డిగెత్తు ఔషధము అనుభవించిన వ్యాధులు హరించిపోవును. చర్దిరోగములు, క్షయరోగములు, శ్లేష్మరోగములు, ఉబ్బు, పాండువును ఉదరములు మొదలయినరోగములు మానును.

## 72 సూతాదిలోహము.

సీ. దరదపారదలోహ తామ్రాభ్రసింధూర కర్పూరకాంతము గంధకమును
కరకకాయపొడిని గల్పియుపాలును అన్నిరసంబుల నదియుదినము
అల్లపురసమును ననుపానమునుజేసి పూటకుచిన్నము పుచ్చుకొన్న
అన్నివ్యాధులబట్టి హతమునుజేయును దేహమారోగ్యమై తేజరిల్లు

గీ. అమరులకుదరికమృతమా యబ్బినట్టు। లిలను సూతాదిలోహము నిట్లుజేయు
మూలరోగంబులకునిది మూలమనుచు। విష్ణుబైరాగితోఁబల్కె విశదముగను.

తా. ఇంగిలీకమును, పాదరసమును, లోహమును, తామ్రభస్మమును, అభ్రకభస్మమును, సింధూరమును, కర్పూరమును, కాంతమును, గంధకమును, కరకకాయలచూర్ణము ఒకపాలుగల్పి చిత్రమూలపురసానగల్పి అల్లపురసమున అనుపానముజేసి పూటకు చిన్నమెత్తు ఔషధముచొప్పున పుచ్చుకొనిన అన్నిరోగములు కొట్టివేయును. దేహము ఆరోగ్యముగా కాంతిగల్గియుండును. దేవతలకు అమృతమువంటిది. ఈ భూమియందు సూతాదిలోహముఅని విష్ణుమూర్తి బైరాగితోజెప్పెను.

## 73 వైష్ణవీరసము.

సీ. వసనాభిదెచ్చియు వెసపాలుగానుంచి యింగిలీకముపాలు నిడగవలయు
కటుకరోహిణిపాలు కటుకత్రికములును నగ్నిరసమునూరి యదిదినంబు
ఒకజాముయంత్రాన నొనరంగవండిన వైష్ణవీరసమవు వయినముగను
అడ్డిగెత్తుమాత్రి లమరంగజేసియు రేబవల్ మాత్రలు రెండువేయ

గీ. విష్ణుక్రాంతకషాయము వీటితోను। అరునొకరోజుమాత్రలు హద్దుచేసి
పుచ్చుకొన్నసురోగము బూనవెరచు। విష్ణుబయిరాగితోఁబల్కె విశదముగను.

తా. వసనాభియొకపాలును, ఇంగిలీకము ఒకపాలును, కటుకరోహిణి ఒకపాలును, శొంఠి పిప్పలి మిరియాలును ఇవి యన్నియు చిత్రమూలరసానమర్దించి ఒకజాము డోలాయంత్రానవండిన వైష్ణవీరసమవును. అడ్డిగెత్తు మాత్రపరిమాణముచేసి రేపుఒకటి మాపుఒకటి రోజున

కు రెండేసిచొప్పున విష్ణుకాంతకషాయముతో నేదురోజులుహద్దుచేసి యిచ్చిన నానారోగములు వెరచును.

### 74 మేహాంతకరసము.

సీ. ముత్యభస్మంబును మున్దుగా నొకపాలు పగడభస్మము రెండు పాళ్ళునుంచి
తామ్రభస్మంబును తగ మూడు పాళ్ళును నాగభస్మంబున నాల్గుపాళ్ళు
అమర గాంధకములోహ మైదుభాగంబుల కాంతమారుపాళ్ళు క్రమముగాను
ఆర్కొనక భాగము నభ్రకసింధూరమ్ము వంగమెన్మిదిపాళ్ళు వరుసగాను
కల్వములో నుంచి కచ్చూరరసమున నుప్పిబూరుగ చెరకుస్త్రీరసము
అయిదుదినంబులు ననువుగా మర్దించి పూటకడ్డిగ యెత్తు పుచ్చుకొన్న
వాతంబు శ్లేష్మంబు పైత్యంబు మరిపాండు క్షయరోగములును నాశంబునొందు
గీ. మూత్రకృఛ్రిలు మేహముల్ మూర్ఛ మొదలు । సకలవ్యాధులు మానంగజాలి
యుండు మేటిమేహాంతకరసమ్ము మేలునిచ్చు । విష్ణుబైరాగి తోబల్కె విశదముగను.

తా. ముత్యాలభస్మము ఒకపాలు పగడభస్మము రెండుపాళ్ళు తామ్రభస్మము మూడుపాళ్లు సీసభస్మమునాల్గుపాళ్ళు లోహము అయిదుపాళ్ళు కాంతము ఆరుపాళ్లు అభ్రకసిందూరము ఏడుపాళ్ళు, తగరభస్మము యెనిమిపాళ్లు, ఇవి అన్నికల్వములో ఉంచి కచ్చూరరసమున నూరి ఉప్పిరసమును, బూరుగరసమును, చెరుకురసమును, ఉస్త్రి ఆకురసమును ఈ అయిదురసముల మర్దించి పూటకు అడ్డిగెత్తు ఔషధము పుచ్చుకొనిన వాతమును, పైత్యమును, శ్లేష్మమును, వణకు రోగములును పాండురోగములును, క్షయరోగములును పోవును మూత్రకృఛ్రి రోగములును, మేహరక్తరోగములును, మూర్ఛలును, సమస్తరోగములును, మానునటువంటి అధికారములుగలదు, ఈమేహాంతకరసముచాలమేలుచేయును అనివిష్ణుమూర్తిబైరాగితో విశదముగబలికినాడు.

### 75. కాలకూటరసము.

సీ. రుద్రుడు నాభియు రసము బుసదరదము బుతువులు సూతము రూఢిగాను
దాతలు దారక దామ్రము వస్తువుల్ పార్వతివీర్యము ప్రాణములను

షడ్రుచిమణిశిల సంధియు త్రిఫలము కరకంఠనేత్రముల్ కటుకములును
సూర్యుడు చంద్రుడు శుద్ధినేపాళను వేడిటంకణమును వేదములను
పంచమూలరసాన పంచదినమ్ములు మర్దించినంజాలమహిమగలదు
కాలకూటరసంబుగలిగెనటంచును గరళకంఠుడుమెచ్చెఘనముగాను
ఆర్ద్రకశొంఠిరసాన్వితౌషధమును ననుదినమును దీనిననుభవింప

గీ. గళపురోగముగవలునుగండమాల । వాయువుక్షయములు సంధులువాంతిజాడ్య
పక్షఘాతంబుతాపముల్ పారిపోవు । విష్ణుబైరాగితోబల్కె విశదముగను.

తా. పదకొండుపాళ్ళునాభియుంచి ఏడుపాళ్లు ఇంగిలీకము పాదరసము ఆరుపాళ్ళుంచి తొమ్మిదిపాళ్లు తాళకముంచి ఎనిమిదిపాళ్ళు తామ్రభస్మముంచి అయిదుపాళ్ళు గంధకముంచి ఆరుపాళ్లు మణిసిలయుంచి మూడుపాళ్ళు కరకతాడి యునికలు మూడుపాళ్ళు శొంఠి పిప్పలి మిరియాలు రెండుపాళ్ళు నేపాళమునుఉంచేది నాల్గుపాళ్లు పొంగించిన వెలిగారము చిత్రమూలమును జిల్లేడువేరును ములగవేరును వరగోగు వేరును దుష్టపువేరును అల్లపురసమును ఈరసాలను అయిదుదినములు మర్దించిన మహిమగల కాలకూటరసము ఘనమైనటువంటిదని ఈశ్వరుడు మెచ్చును అల్లపురసమును శొంఠిరసమునను అనుపానము జేసి యీయౌషధమును నిత్యమును అనుపానముచేత పుచ్చుకొనిన గళరోగమునుదగారోగములును గండమాల రోగములును వాయువులు క్షయలు సన్నిపాతములు పక్షవాయువులును తాపములును వాంతిజాడ్యములును ఈరోగములన్నియు పోవునని విష్ణుమూర్తి బైరాగితోబలికినాడు.

## 76. యోగినీరసము.

సీ. హాయనివీర్యమ్ము నమరశిలగంధము నాభియుసిరికయు నాగరమును
తాడిపిప్పలిమిర్య తాళకటంకణాల్ సమరసగాజేసి సరిగనిరియు
వీటికిసగముగా చిరియు నేపాళము లలితభృంగి నిమ్మపండులరసాన
నాల్గుదినమ్ములు నయముగానూరియు మాషమాత్రలు చేసిమంచిగాను

గీ. వహ్నిరసమున నిచ్చిన వాయువులును। కుటిలపొందలించి రోగముల్ కూలిపోవు
ప్రజలకీ రసమెప్పుడు ప్రాణపదము। విష్ణుబయిరాగితోఁ బల్కె విశదముగను

తా. పాదరసమును, అమరశిలగంధకమును, నాభియును, ఉసిరికపప్పును, కరకకాయలును సొంటియు తాడికాయలును పిప్పళ్ళును మిరియములును వెలిగారమును ఇవిసమముగా జేసి వీటికి అరసగము నేపాళములుంచి గుంటకలగరాకు రసమునను నిమ్మపండ్లరసమునను నాలుగురోజులు ఈరసమునసూరి మాత్రలుచేసి వహ్నిరసముచేతను అనుపానము చేసియిచ్చిన వాయురోగములును కుటిలము విడగొట్టివేయును. రోగములు కూలదీసివేయును, మానవులకు ఈయోగినీరసము ప్రాణపదమువంటిది. అనివిష్ణుమూర్తి బయిరాగితో చెప్పినాడు.

## 77 లోహరసాయనము.

సీ. కత్తితుప్పతులమ్ము గంధకమ్ముతులమ్ము రజతమ్ముతులమును రసముతులము
కల్వంబులోనుంచి కలగరరసమును సాంబ్రాణిరసమును సరసముగను
వజ్రవల్లిరసమ్ము వహ్నిగజ్జేరును కలబందయుల్లము కాకరాకు
వెననీరసంబుల విడువకుండగ చాల రెండురోజులుసూరి రేయుఁబవలు
అడిబిళ్ళవలెజేసి యార్చి పైమీదఁబెట్టి ప్రమిదగప్పియు మన్ను ప్రబలరాచి
గజముపొడ్గుపుటమ్ము ఘనముగావేసి యు శీతలంబునఁదీసి శీఘ్రముగను
మునురసంబులనూరి ముదముమీరంగను ననుదినమౌషధమద్దిగెత్తు
గీ. అనుభవించిన జనులకు నమృతమవును। మూలవ్యాధులు మాన్పను ముదమువిచ్చు
సిద్ధిలోహరసాయనం బింపుమీర। విష్ణుబయిరాగితోఁ బల్కె విశదముగను.

తా. కత్తారిచూర్ణము పాలు గంధకముపాలు. వెండిచూర్ణముపాలు, పాదరసముపాలు, ఇవికల్వములోనుంచి గుంటకలగరాకురసమునను సాంబ్రాణి ఆకు రసమునను నల్లేరురసమునను చిత్రమూలపురసమునను గలజేరు ఆకురసమునను కలబందరసమునను కాకరాకురసమునను ఇన్నిరసములు రెండురోజులు రాత్రిందివములుమర్దించినూరి బొ

షధము బిళ్ళగాజేసి ప్రమిదలోబెట్టి మీాదను ప్రమిదగప్పి మన్ను దా నిచుట్టుగప్పి గజముపాడవున పుటమువేసి చల్లారినతర్వాత దీనీ ముందు గానూరిన రసములను మరలనూరి సిత్యమును అగ్నిగెత్తు ఔషధముచొ ప్పున పుచ్చుకొన్న వారికి అమృతముతో సమానమవును. మూలవ్యాధు లనుమాన్పి సంతోషమునిచ్చును. లోకమందున లోహరసాయన మిది యని విష్ణుమూర్తి బయిరాగితోఁ బల్కినాడు.

## 78 ప్రతాపలంకేశ్వరము.

సీ. పారదాభ్రకములు పార్వతివీర్యము మూఁడుమూఁడగుపాళ్లు ముదముమీర
దూడరేణముగాల్చి తోడనెభస్మము హరనేత్రములతోడ సమరసంచి
తగభస్మమునుచేసి దగ వేదములసరి త్రివిధసంధులుజేసి త్రిష్టులోహ
శూద్రనాభియుదెచ్చి శుద్ధిగాఁజేసియు వసువులుగాఁజేసి వరుసగావు
నెమ్మికల్వమ్మున నిగుఁడిరసమున మర్దించియొకనాఁడుమాపురేపు
గురివెందపూసల గురిగానుమాత్రలు సల్పిసేవించినజనులకెల్ల
సన్నిపాతంబులు సమసిపోయెడునన్ని సప్తజ్వరంబులనపహరించు
గీ. శీతలంబునువిడిపోవు శీఘ్రముగను । కఠినరోగములనుగొట్టి కడకుదోలు
కేవలంబీప్రతాపలంకేశ్వరమును । విష్ణుబయిరాగిలోఁబల్కె విశదముగను.

తా. పాదరసమును, అభ్రకమును, గంధకమును, ఈమూఁడు మూఁడుపాళ్ళును. పాలుకుడుచుచున్న దూడరేణము కాల్చినభస్మము మూఁడుపాళ్లు, శంకిభస్మము నాలుగుపాళ్ళు, మూఁడుపాళ్లు లోహము, శుద్ధిజేసిననాభి యెనిమిదిపాళ్ళు, ఈవస్తువులు కల్వములోనుంచి వావి లాకురసమున నొకదినము మర్దనచేసి గురివిందగింజవలె మాత్రలు చేసి పుచ్చుకొనిన మనుష్యులకు సన్నిపాతములును అన్నియుపోవును. ఏడు జ్వరములను కొట్టివేయును. శీతలము వదలిపోవును. కఠినరోగములను కొట్టివేయును. కేవలము ప్రాణమును ప్రతాపమును కలిగినటువంటిద ని ఈప్రతాపలంకేశ్వరము, ఇంత మహిమగలదని విష్ణుమూర్తి బయి రాగితో విశదముగాఁ బల్కినాడు.

## 79. కాంతవల్లభరసము.

సీ. సొంపైన కాంతము షోడశభాగముల్ పటిమ లోహము పాళ్ళు పదియునాల్గు
మంచిమండూరము మరి ద్వాదశాంశము లభ్రకంబును పాళ్ళు నారునాల్గు
నెన్నికతామ్రము నెనిమిదిపాళ్ళను నెత్తుటిమణిశిల యొప్పవియును
పచ్చిటంకణమును పాళ్లనునాలుగు వెండిభస్మము పాళ్ళు వెలయ రెండు
బంగారుభస్మము పాలదియొకట్టి ఈశ్వరవీర్యము నిన్నియెత్తు
గంధకమంతియె కల్పంగవలయును హంసపాదిరసాన నరయనూరి
గాజుకుప్పెను బెట్టి ఘనముగ కుప్పెలో గురిగని సుకపోసి కుప్పెఁబెట్టి
గీ. సప్తదినములు వండిన సరసముగను । కాంతవల్లభరసము కాంతిగల్గి
సకలవ్యాధులనెల్లను సంహరించు । విష్ణుబైరాగితోఁ బల్కె విశదముగను.

తా. కాంతము పదునారు భాగములు, లోహముపదునాలుగు భాగములు, మాండూరముపండ్రెండుభాగములు, అభ్రకముపదిపా. తామ్ర భస్మ మెనిమిదిపా. రక్తమణిశిల ఆరుభాగములు, పచ్చివెలిగారము నాలుగుభాగములు, వెండిభస్మము రెండుభాగములు, బంగారుభస్మమొకపాలు, ఈ వస్తువుల యెత్తు పాదరసము, గంధకము పాదరసముతో సమానముగనుంచి యివి హంసపాదియాకు రసమునమర్దించి ఈ ఔషధము గాజుకుప్పెలోనుంచి కుండలో నిసుకపోసి గాజుకుప్పెతో ఇసుకమధ్యనుంచి యేడురోజులువండిన ఈ కాంతవల్లభరసము సమస్తరోగములను కొట్టివేయును. అని విష్ణుమూర్తి బయిరాగితో విశదముగాఁ బలికినాడు.

## 80. మృతోద్ధాపనరసము.

సీ. తామ్రటంకణలోహ తాళకభస్మముల్ మణిశిలగరళము మస్తకమును
అగ్నికనాభులు నమరశిలయుసజ్జ కారసుయవసద్య క్షారములును
పంచలవణములు పాషాణములుమూడు చెంగల్వకోష్టును శివునివీర్య
కటుకత్రిరసముల కలయంగమర్దించి కుప్పెలోపలనుంచి కూర్మితోడ

వాలుకంబునజాము తరువగావండియు కలువంబునందుంచి కలియనూరి
మత్స్యపైత్యమ్మును మయూరమజమార్జ పిత్తముల్ గల్పియు ప్రీతిగాను
దినమన్నిటదగమర్దించి దానినిదీసి గురువిందలంబలె గురిగజేసి
గీ. అల్లమనుపానమునననిదియనుభవింప । నన్నిరోగములనుబాపియాయువిచ్చు
ఇదిమృతోద్ధావనరసమై యిలనుజెలగు। విష్ణుబైరాగితోంబలెక- విశదముగను.

తా. తామ్రభస్మము, వెలిగారము, లోహము, తాళకభస్మము మణిశిలయు, గరళము, మస్తకియు, అభ్రకము, నాభియు, అమరశిల గంధకము, సజ్జంకారము, యవక్షారము, సద్యోక్షారము, సైంధవలవణము, సౌవర్చలవణము, సముద్రలవణము, బిడాలవణము, కాచలవణము ఇవి అయిదును ఉల్లిపాషాణము, గౌరీపాషాణము, దొడ్డిపాషాణము, చెంగల్వకోష్టు పాదరసము, శొంఠి పిప్పలి మిరియాలురసమును తీసి నూరి కుప్పెచేసి యిసుక కుండలోబోసి ఈ గాజుకుప్పె కుండలో నుంచిజాముపండి కల్వములోనుంచి చేపచేదు, దున్నపోతుచేదు, నెమలిచేదు, మేకచేదు, తాబేలుచేదు, ఈచేదులుగల్పి చిత్రమూలరసమున ఒకదినముమర్దించి గురివెంద పూసలంత మాత్రలుచేసి అల్లపురసము అనుపానముజేసి పుచ్చుకొనిన అన్నిరోగములను కొట్టివేసి ఆయువునిచ్చును. ఈఔషధము మృతినొందుటకు సిద్ధముగనున్నవారిని బ్రతికించును అనిచెప్పినారు.

## 81. పూర్ణచంద్రోదయము.

సీ. పాదరసంబును ఫలములునెనిమిది బంగారుభస్మము ఫలమునొకటి
పార్వతిపీర్యము ఫలములుపదునారు నివిమూడుకల్వాన నిడుచుమరియు
కలబందరసమున గట్టిగామర్దించి గాజుకుప్పెనుబెట్టి ఘనముగాను
వలయుభాండమ్మున వాలుకంబునుపోసి కుప్పెవాలుకమధ్య మార్చిపిదప
భాండముపైమీద బాగుగానుంచియు మందవేదాగ్నిచే మంటనిడుచు
మూడుదినమ్ములు మూదమొప్పవండిన మంతెనపుష్పసమమయియుండు
శీతలంబునదీసి శీఘ్రముగనుకుప్పె విడజేసిమందును వెలయజేర్చి

గీ ఆర్ద్రికరసంబుతోఁగల్పి యౌషధమును। వ్రీజలుదిన్నను వీర్యను బ్రబలమగును
పూర్ణచంద్రోదయం బెంపుడుఁ బూజ్యమనుచు। విష్ణుబైరాగితోఁ బల్కె విశదముగను.

తా. పాదరసమెనిమిదిపాళ్ళు, బంగారుభస్మము పాలు, గంధకముపదునారుపాళ్ళు ఈమూడును కల్వమునసుంచి కలబంద రసముననూరి గాజుకుప్పిలో నుంచి గట్టికుండలో నిసుకబోసి యీగాజుకుప్పె యిసుకమధ్యనుంచి యీకుండపొయిమీదనుంచి మందముగాను వడిగానుమంటవేసి యీలాగున మూడురోజులు రాత్రింబగళ్ళు వండినమంకెనపువ్వుతో సమానమైన కాంతిగానుండును చల్లారిన తర్వాత తీసి కుప్పె చిట్లగొట్టి ఔషధము నొకపళ్ళెరములోనికికూడ తీసికుప్పెచేసి అది అల్లపురసము అనుపానముచేసి ఆయౌషధము తిన్నవారికి వీర్యవృద్ధియగును ఈపూర్ణచంద్రోదయము మహాపూజ్యమయినటువంటిదని విష్ణుమూర్తిబైరాగితో విశదముగా బల్కినాడు.

## 82 హేమరజతరసాయనము.

సీ కాంచనంబుఫలమ్ము ఖడ్గముఫలమును రజతముఫలమును రసముఫలము
పార్వతివీర్యము ఫలములు నాల్గును సివికల్వమునసుంచి యింపుగాను
వజ్రవల్లిరసాన వహ్నిరసమ్మున నొకరోజుమర్దించి యుచితముగను
మూసలోఁబెట్టియు మూతమీదనుగప్పి గజపుటమును వేయు గట్టిగాను
గీ. హేమరజతరసాయన మెచ్చుగాను। ఆర్ద్రిగత్తౌషధముదిన మనుభవింప
జడిసిపోవుచురోగముల్ జవముగాను। విష్ణుబైరాగితోఁ బల్కె విశదముగను.

తా బంగారము పాలు కటారిచూర్ణము పాలు వెండిచూర్ణము పాలు పాదరసము పాలు గంధకము నాలుగుపాళ్ళు ఇవి కల్వములోనుంచి నల్లేరు రసమును చిత్రమూలపు రసమును ఈరసములను ఒక దినము మర్దించి మూసలో నీయౌషధము పెట్టి పయిని మూతవేసి గజపుటమువేసిన హేమరజత రసాయనము అనుపేరుగలది అర్ద్రిగెత్తుఔషధము పూటకు పుచ్చుకొనిన రోగములుజడిసిపోవును అనివిష్ణుమూర్తిబైరాగితో విశదముగాబల్కినాడు.

## 83 పైత్యాంతకరసము.

సీ. ఖర్జూరఫలమున కాంతియౌ వసనాభి ఘనమైన గరళము గంధకమును
సూతంబు హింగుళి శుద్ధి నేపాళము సొంటి పిప్పలియును సొంపుగాను
అక్కలకర్రయు నాభీను మిరియాలు వెలిగారమొకపాలు వేయవలయు
ఒనర వావిలి చేత నొకనాడు మర్దించి కలగరతో రోజు కలియనూరి
జంబీరరసమున జాము మర్దించియు మానంబు సరిగాను మాత్ర జేసి
మాపు రేపును రెండు మాత్రలు చొప్పున మూడు రోజులలోన ముఖ్యముగను
ఆను సంధులు మాను సరవు లేక విషంపు జ్వరములు వ్యాధులు విరిగిపోవు
గీ. వాయువులు పైత్యవణములు వదలిపోవు । గుల్మరోగంబులన్నియు గూలిపోవు
నిదియు పైత్యాంతకరసమై యిలను మించె । విష్ణుబైరాగితో బలెక్క విశదముగను.

తా. ఖర్జూరపుపండ్లతో సమానమయినటువంటి వసనాభియు గరళమును గంధకమును పాదరసమును ఇంగిలీకమును శుద్ధిచేసిన నేపాళమును శొంఠియు పిప్పళ్లును అక్కలకర్రయును నల్లమందును మిరియాలును వెలిగారమును వావిలాకు రసమున ఒకరోజును ఒకదినము గుంట కలగరరసముతోను మర్దించి నిమ్మపండ్లరసమున జాముమర్దించి మినపగింజవలె మాత్రలు జేసి ప్రొద్దున ఒకటియు సాయంకాలమునందు ఒకటియు నీప్రకారమిచ్చిన ఆరుసన్నిపాతములును విషజ్వరములును వ్యాధులన్నియుమానును. వాయువులును పైత్యరోగములునుపోవును గుల్మరోగములునుపోవునుఇదిపైత్యాంతక రసమని విష్ణుమూర్తిబైరాగితో విశదముగాబల్కినాడు.

## 84. హిరణ్యగర్భరసము.

సీ. బంగారమును వెండి పగడాలు మణిశిల తాళకచక్రంగ తాళకములు
ఆజదగ్ధమును బోసి యరజాము నూరియు వజ్రమూసను వైచి వరుసగాను
పొడవైన పుట మొండు పొందుగా వేసియు తీసి పాలను సదితిరుగనూరి
చక్కెరతగం గల్పి సరిగ సేవించిన కఫపిత్తద్వంద్వరోగములు మాను

గీ. శుక్లమేహము వాతము శూలలన్ని । శిరపురోగములును బోవు శీఘ్రముగను
కలినిదగు చుండునుహిరణ్యగర్భరసము । విష్ణుబైరాగితోబలెకె విశదముగను.

తా. బంగారము, వెండియు, పగడములు, మణిశిలయు, తామ్రము, కటుకరోహిణియు, తాళకము, మేకపాలుపోసి నాలుగుగడియలు మర్దించి వజ్రపుమూసఅనగా పుట్టమన్ను మూసకట్టి ఆర్చి మూసలోనుంచి గొప్పపుటము వేసి తీసి తర్వాతను పాలతోనూరి పంచదార కలుపుకొని పుచ్చుకొన్నవారికి శ్లేష్మరోగములును, పైత్యరోగములును, ద్వంద్వరోగములును మానును, శుక్లమేహములును, వాతములును, శూలలును, శిరోరోగములును పోవును. కలియుగమునకు ఈహిరణ్యగర్భరసము భుక్తిని ముక్తిని కలిగించునని విష్ణుమూర్తి బైరాగితో బలికినాడు.

## 85. శ్రీలక్ష్మీనారాయణరసము.

సీ. శ్రీఖండమున తామ్రశిఖిగంధకటంకణ తాళకములనైదు తప్పకుండ
సూటిమార్గములను శుద్ధులు చేయగా నల్పిజాగ్రతగాను జనులుమీరు
కల్వములోనుంచి గలిజేరురసమున రెండురోజులునూరి రేయుబగలు
జాముయంత్రమునను నరివండిమాత్రలు జేసిపూటకును రెండేసితిన్న
గీ. శీతజ్వరములకెల్లను శీఘ్రముగను ! గట్టిగాబట్టుకొను వానిగర్వమణచి
లక్ష్మినారాయణరసంబు లక్షణంబు । విష్ణుబైరాగితోబలెకె విశదముగను.

తా. గంధకము, తామ్రభస్మము, మైలతుత్థము, వెలిగారమును, ఈఅయిదు సమభాగములు జేసి ఇవి జాగ్రత్తగా శుద్ధులుచేసి కల్వములోనుంచి గలిజేరురసమున రెండురోజులు రాత్రింబగళ్ళునూరి, ఒకజాము డోలాయంత్రమున వండి మాత్రలుచేసి పూటకు రెండేసిచొప్పున నిచ్చినయెడల జలిజ్వరముల మదమును అణచివేయును. లఘుతరమమునటువంటిది. ఈలక్ష్మీనారాయణరసమును ఇంతి మహిమ గలదని విష్ణుమూర్తి బైరాగితో విశదముగా బలికినాడు.

## 86. బ్రహ్మాస్త్రరసము.

సీ. పాషాణములుమూఁడు పాలతుత్థము నాభి అమరశిలయు గంధకాభ్రకములు
మణిశిలదరదము మంచినేపాళము సజ్జకార సైంధవ సజ్యక్షార
లఘుతరంబగుబిడా లవణముమిరియాలు యవక్షారటంకణా లందముగను
మాయూరతుత్థము మంచియింగువయును ఈశ్వరవీర్యము నిన్ని యెత్తు
అరవదిరోజులు ఆర్ద్రికవహ్నిను రసములమర్దించి రాత్రిపగలు
నొకనాఁడుయంత్రిన. నుగివండితీసియు మాయూరభాగను మత్స్యమూర్త
సర్పజంబుకముల సమపిత్తములఁగొని నూరిబరిణబెట్టి తోరముగను
గీ. కత్తిఖాల్లేసి బ్రహ్మరంధ్ర పాలమందు । బెట్టిరాచినరోగముల్ బెదరిపోవు
అధిక బ్రహ్మాస్త్రరసమిది యనియందు । విష్ణుబైరాగితోఁ బలెక్రా విశదముగను.

తా. ఉల్లిపాషాణమును గౌరీ పాషాణమును నెల్లిపాషాణమును పాలతుత్తము నాభియు అమరసిలగంధకమును అభ్రకమును మణిశిలయును ఇంగిలీకమును నేపాళమును సజ్జకారమును సైంధవలవణమును సర్జ్యాక్షారమును బిడాలవణమును మిరియాలును యవక్షారమును వెలిగారమును మైలుతుత్తమును ఇంగువయు ఇన్నివస్తువుల యెత్తు పాదరసమును అయిదురోజులు అల్లపురసమును చిత్రమూలరసమును అయిదు దినములు రాత్రిబవలు మర్దించి ఒకదినము డోలాయంత్రమునవండి తీసి నెమలిచేదును మేకచేదును తాబేటిచేదును పాముచేదును నక్కచేదును ఈచేదులతో మర్దించి రాగిబరిణెలో మంచి బ్రహ్మరంధ్రమందు పైని కొంచెము కత్తిపోట్లువేసి ఆయౌషధము బెట్టిరాచిన రోగములు బెదరిపోవును. అధికమైనటువంటి బ్రహ్మాస్త్రరసమును పేరుగలదని విష్ణుమూర్తి బైరాగితో విశదముగా బలికినాడు.

## 87. రాజౌషధము.

సీ. పాషాణములునుల్లి పాషాణమునుగౌరి పాషాణముపరెండు పాళ్లురెండు
నాల్గురసంబులు నాలుగుపాళ్ళను పారదశమ్మునుగూడ సమరగాను
తాళకముకపాలు తామ్రముపాలును మణిశిలపాలును మంచిదిగను

నెల్లిపాషాణము నెరినొక్క పాళ్లును గంధకమును పాలు గలుపవలయు
కల్వాన నవియన్ని గట్టిగా మర్దించి ఆవయి మూసలో నదియుబోసి
ఆపీనబిల్లయు నాపైని మూసియు మూకిటిలో బెట్టి మూతగప్పి
గడియదీపాగ్నిని ఘనముగా వండిన నరయ రాజౌషధంబమరియుండు

గీ. నేలకులు జీలకఱ్ఱయు నివియు దీని। నేతగల్పుక తిన్నను నెట్లుగాను
సుఖము నంగల్లు జాడ్యము ల్నుడుగు ననుచు। విష్ణుబైరాగితో బల్కె విశదముగను.

తా. ఉల్లిపాషాణమును, గౌరీపాషాణమును, రెండును రెండు పాళ్ళు పాదరసమును, కర్పూరమును, ఇంగిలీకమును, సింధూరమును, నాలుగురసములు నాలుగు పాళ్ళు తాళకమొక పాలును, తామ్రభస్మము పాలును, మణిశిలపాలును, నెల్లిపాషాణము పాలును, గంధకము పాలును, ఈ వస్తువులు కల్వమున బెట్టి మర్దించి నల్లమందు మ్మూసచేసి ఆమూస లోపోసి, నల్లమందు కొంచము బిళ్ళచేసి మూసమీదను పేసి ఆమూస మూకుటిలో బెట్టి పైని మూకుడుమూసి సీలమన్ను నిచ్చి గడియ దీపాగ్ని చేతవండిన, అధికమయినటువంటి రాజౌషధము పేరుగలిగిన రాజసుఖము కలదియాను. ఈ రాజౌషధమునకు ఏలకులును, జీలకఱ్ఱయును, నేతితో గలిపి పుచ్చుకొనిన సుఖజాడ్యములు సవాయి మొదలగు రోగములు జ్వరములు మానునని విష్ణుమూర్తి బైరాగితో విశదముగా బలికినాడు.

## ౫౫ బాలసూర్యోదయము.

సీ. అభ్రికసింధూర హైందుభాగంబులు పార్వతీవీర్యము పాళ్ళుమూడు
దరదమూరును పాళ్ళు తామ్రము పాలును మండిమొవ్వలోహము మూడుపాళ్ళు
గవ్వలభస్మము గలిపియు నొకపాలు నాభియు పాలును నయముగాను
పదిజాములును నిమ్మపండ్లరసమ్మున మర్దింపలానక్కరు మహిమగలిగి

గీ. బాలసూర్యోదయంబగు బాగుమీర। నల్లమును పానముగ దిన్న నౌషధమును
అధికరోగాదులంబట్టి హతముజేయు। విష్ణుబైరాగితో బల్కె విశదముగను.

తా. అభ్రికసింధూరము అయిదుపాళ్ళు గంధకము మూడుపాళ్ళు ఇంగిలీకము ఆరుపాళ్లు లోహముమూడుపాళ్ళు గవ్వభస్మముపాలు నాభిపాలు నిమ్మపండ్లరసముచేతను పదిజాములుమర్దనజేసి సూర్యునితో సమానమయినటువంటి పరాక్రమమునుగలదై బాలసూర్యు డుదయించినట్టుగానే యుండును ఈఔషధము అల్లపురసము అనుపానముజేసి యిచ్చిన అధికమయినటువంటి రోగములను కొట్టివేయును అని విష్ణుమూర్తి బైరాగితో చెప్పినాడు.

ఇది బైరాగిచేసిన ధన్వంతరివిజయమునం జతుర్థాశ్వాసము

సంపూర్ణము

శ్రీ శ్రీ శ్రీ



బ్రి॥ కాశీనాధుని వీరమల్లయారాధ్య విరచిత

# గ్రంథములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1. | సంగీత సత్యహరిశ్చంద్ర | (నాటకము) | ... | రు 0—12—0 |
| 2. | ,, ఉషాపరిణయము | ,, | ... | 0—12—0 |
| 3. | గయోపాఖ్యానము | ,, | ... | 0—8—0 |
| 4. | కన్యకాపరమేశ్వరీ | ,, | ... | 0—8—0 |
| 5. | తారాచంద్రీయము | ,, | ... | 0—12—0 |
| 6. | సారంగధర వి. సు విరచితము | ,, | ... | 0—12—0 |
| 7. | కుశలవనాటకము | | ... | 0—12—0 |
| 8. | మార్కండేయము | ,, | ... | 0—12—0 |
| 9. | మేనకాకౌశికముశృంగారము | (సంవాదము) | ... | 0—4—0 |
| 10. | తెనాలి రామలింగనికథలు | (పద్యకావ్యము) | | 0—4—0 |
| 11. | వ్యవహారబోధిని | (ప్రథమభాగము) | | 0—4—0 |
| 12. | ,, | ,, | ... | 0—4—0 |
| 13. | వేశ్యావిటీయము | ,, | ... | 0—0—6 |
| 14. | స్త్రీవిద్య | ,, | ... | 0—0—6 |

## ఇతరగ్రంథములు.

| | | | | |
|---|---|---|---|---|
| 15. | రాణీసంయుక్త | (నాటకము) | ... | 0—12—0 |
| 16. | నేత్రదర్పణము | (వైద్యగ్రంథము) | | 0—8—0 |
| 17. | ధన్వంతరివిజయము | ,, | ... | 0—8—0 |

వలయువారు దిగువ విలాసమునకు వ్రాసి తెప్పించుకొనుడు.

## కర్రా వెంకటరత్నము.

బుక్కుసెల్లరు ఏలూరు.

